(ప్రాచీన నాడీ జ్యోతిష గ్రంథం)

రచన

మేడవరపు సంపత్ కుమార్

ఎం.ఎ. (సంస్కృతం)

ఋషి

ప్రచురణలు

మెయిన్ రోడ్, హనుమాన్‌పేట్,

# చంద్రకళానాడి

రచన
**మేడవరపు సంపత్ కుమార్** ఎం.ఎ., (సంస్కృతం)
4-399, తారకరామనగర్,
విశ్వామిత్ర బిల్డింగ్స్, నర్సింహ రోడ్,
జగన్నాథపురం, కాకినాడ-2
ఫోన్ : 2341878, 98493 54393

మొదటి ముద్రణ : 2004

ముద్రణ : స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, VJA-3

డి.టి.పి.
శ్రీ గ్రాఫిక్స్, విజయవాడ-3 ఫోన్ : 98486 72030, 5542100

ప్రచురణ :
ఋషి ప్రచురణలు
మెయిన్ రోడ్, హనుమాన్‌పేట,
విజయవాడ - 520 003.
ఫోన్ : 0866 - 2579190

వెల : **రూ. 20-00**

# విషయ సూచిక

# ఒక్కమాట

ంపాదకులు
జ్యోతిష విజ్ఞాన పత్రిక"

"జ్యోతిష విజ్ఞాన భాస్కర"
బ్రహ్మశ్రీ
మధుర కృష్ణమూర్తి శాస్త్రి
రాజమండ్రి - 4

శ్రీ మేడవరపు సంపత్ కుమార్ గారు సంస్కృత ఆంగ్ల, ఆంధ్ర భాషలందు మంచి పాండిత్యము కలిగి జ్యోతిసశ్శాస్త్ర మందు విశేష కృషి సలుపుచున్న విద్వాంసులు

వీరు ఆంధ్రీకరించిన "చంద్రకళానాడి" అను గ్రంథమును నన్ను పరిశీలించిన అభిప్రాయమును వ్రాయమని కోరినందులకు చాలా సంతోషమైనది

చంద్రకళానాడి యను యీ గ్రంథము. "దేవకేరళ" యను బృహద్గ్రంథమును గురించి తెలుసుకొను విధానమును సూచించును.

మన దేశమందు నాడీ గ్రంథములను పేరుతో జాతక ఫలములను చెప్పటకు కొన్ని గ్రంథములను పేరుతో జాతక ఫలములను చెప్పటకు కొన్ని

కోయిల్, మొదలగు చోట్ల ప్రసిద్ధముగనున్నవి. రాజమండ్రిలో భృగునాడియను ఒక నాడి గ్రంథముండేది ఆ గ్రంథాన్ని బట్టి అనేకులు జాతక ఫలితాలను చెప్పించుకోవడం దాని వలన సత్ఫలితాలను పొందడం జరుగుతూ వుండేది. ఈ నాడీ గ్రంథ మీ వూరులో లేదు. ఆ &రగంధమును చదివే వారెక్కడికో వెళ్ళిపోయినారు. 1948 ప్రాంతములో 'నందినాడి'యను ఒక తమిళ భాషలో నున్న నాడి గ్రంథమునొక తమిళ పండితుడు తెచ్చెను. ఆ సమయంలో చాలామంది తమ తమ జాతకములను చూపించుకొనిరి దీనిలో తెలుపబడిన ఫలితాములాశ్చర్యమును గొలుపు రీతిలో నుండెను. మా స్నేహితులొకరు వారి వద్దకు వెళ్లగ వారి హస్త రేఖలను బట్టి వారి జన్మదినము, జాతకమును నందినాడి నుండి తీసి చూపగ మా స్నేహితుల వద్ద



జాతకముతో పూర్తిగ ఏకీభవించుట చేత హస్తరేఖలకు జాతకమునకు గల సంబంధమును తెలుసుకొని విస్మయము కలిగినది. మన మహర్షులెంతటివారో, వారి త్రికాలజ్ఞత యెట్టిదో, హస్తరేఖలకు, జన్మకాల గ్రహస్థితికి గల సంబంధము ఏ విధముగ తెలుసుకొన వీలగునో సుస్పష్టముగ తెలియును.

శ్రీ సంపత్ కుమార్ గారు యీ గ్రంథమందు

1) నాడీగ్రంథములు, 2) 150 నాడీ అంశల పట్టిక (చర, స్థిర ద్విస్వభావ రాశులలో నాడీ అంశ నిర్ణయము, 3) మేష లగ్నం ఇందు, 1. చంపక, 2. ధనద, 3. సమ, 4. మంగళాంశ, 5. అచలాంశ, 6. కుటిలాంశ అను 6 అంశాలకు ఫలమును వ్రాసినారు.

4. ప్రత్యేక గోచార ఫలితములు ఇందు, వివరించిన సూత్రములన్నీ లగ్నముల వారికి ఉపయోగించ వచ్చును.

ఉదా : 4 సూత్రములో ద్వితీయ పంచమాధిపతుల స్ఫుటమునకు కుజస్ఫుటము కలుపగవచ్చిన రాశ్యాధికి గోచార శని వచ్చినచో నా జాతకునకు పశు నష్టం, ఆస్థి నష్టం, వంటివి కలుగును. ఇది ప్రతి జాతకునకు వర్తింపజేయవచ్చును ఇట్లే ఇతరుములు....

తరువాత 2 వృషభ లగ్న విచారణలో కొన్ని ముఖ్యాంశములు - రుద్రమాలికాది యోగములు - వాని ఫలములు షష్ఠ్యంశములు - అంశల ఫలపట్టిక యివ్వబడినది. 'దేవకేరళ'మును గ్రంథమునకు సారభూతముగ గ్రంథము విమర్శించబడినట్లు తోచుచున్నది. .

శ్రీ సంపత్కుమారుగారు వెుత్తము గ్రంథమును అనువదించి ప్రచురించినచో యీ గ్రంథస్థములైన విసయములు జ్యోతిష శాస్త్రజ్ఞుల కత్యంతో ఏ కారకములు కాగలవు. శ్రీ కుమారుగారు శీఘ్రములో నిట్టి మహత్కార్యమును చేయుటకు భగవంతుడనుగ్రహించుగాక -

రాజమండ్రి — శ్రేయోభిలాషి

1-3-97 — **మధుర కృష్ణమూర్తి శాస్త్రి**





శ్రీం

# చంద్రకళానాడి

ఓం అశ్వలాయనాయ నమః

శ్రీ మహాగణాధిపతయే నమః

సంస్కృత భాషలో నాడీ గ్రంథములు అనేకములున్నవి. అనేక విధానములలో నున్నవి. ప్రస్తుత "చంద్రకళానాడి" గ్రంథము కేరళ దేశమునకు చెందిన అచ్యుతుడు, వెంకటేశుడు అను దైవజ్ఞులు రచించారు. దీనినే 'దేవకేరళం' అని కూడా అంటారు. ఇది సంస్కృత భాషలో శ్లోక రూపముగా వ్రాయబడింది. అచ్యుతుడు 3407 శ్లోకాలు, వెంకటేశుడు 4775 శ్లోకాలు వ్రాశారు. మొత్తం 8182 శ్లోకాలున్నాయి. దీనిని శ్రీ ఆర్. సంతానం ఇంగ్లీషులో సంపూర్ణానువాదం చేశారు. అచ్యుత, వెంకటేశుల కాలం మాత్రం తెలుపబడలేదు. అయితే ఈ వెంకటేశుడు, సర్వార్థ చింతామణికర్త అయిన వెంకటేశుడు కాదు. ఎందుచేతనంటే, అతడు భరద్వాజ గోత్రీయుడు, చంద్రకళానాడీకర్త కాశ్యప గోత్రీకుడు.

ఒక వృత్తానికి 360 డిగ్రీలు. అలాగే ఖగోళంలో 360 డిగ్రీలు. 12 రాశులకు ఒక్కొక్క రాశికి 30 డిగ్రీల చొప్పున మొత్తం 360 డిగ్రీలు. ఒక డిగ్రీకి 60 నిమిషములు (లిప్తలు)

ప్రాచీనులు ఒక రాశికీ 150 నాడీ అంశలు పేర్కొన్నారు. అంటే 12 ని॥లకు ఒక నాడీ అంశ ఏర్పడుతుంది. ఈ నాడీ అంశ విప్ర, క్షత్రియ, వైశ్య, శూద్ర కాలములుగా నాలుగుగా మరల విభజించారు. అంటే ఒక నాడీ అంశలో 3 ని॥లకు ఒక ఉప విభాగమన్నమాట. ఆయా ఉప విభాగములలో జన్మించినవారు





ఆయా వర్ణములకు చెంది విభిన్న ఫలితములు పొందుతారు. ఇది గాక నాడీ అంశ పూర్వార్ధమని, పరార్ధమని స్థూలంగా 2 భాగములుగా నున్నది.

ముందుగా లగ్నము, గ్రహములు స్ఫుటము చేసిన తరువాత లగ్నము, గ్రహములు ఏ నాడీ అంశలో ఉన్నదీ గమనించాలి. ఆ నాడీ అంశననుసరించే, నాడీ గ్రంథములో జీవిత విశేషాలు లభ్యమవుతాయి. "ధృవనాడీ" గ్రంథములో ఈ లగ్న నాడీ అంశ మరియు నవాంశ చక్రము నాధారము చేసుకొనే ఫలితములు తెలుపబడ్డాయి.

చర లగ్నములకు "వసుధ" నాడీ అంశ నుంచి స్థిర లగ్నములకు 150వదైన "పరమేశ్వరీ" నాడీ అంశం నుంచి ద్విస్వభావ లగ్నములకు 75వ నాడీ అంశ అయిన 'మహామాయ' నాడీ అంశం నుంచి ప్రారంభం అవుతాయి. పాఠకుల సౌకర్యార్థం లగ్నం లేదా గ్రహముల యొక్క డిగ్రీల ననుసరించి, నాడీ అంశ తెలుసుకోవడం కోసం ఒక "పట్టిక" తయారుచేశాను. దీని ద్వారా లగ్నం ఏ నాడీ అంశలో నున్నదీ సులభంగా తెలుసుకోవచ్చు.

ఉదా - వృశ్చిక లగ్నం. $25^{\circ}37'$ డిగ్రీలో జననమయితే. ఇది స్థిరలగ్నం కనుక పట్టికలో 25.36 నుంచి 25.48 వరకు స్థిరలగ్నములకు 22వ నాడీ అంశ అయింది. ఇది "ధృవ నాడీ అంశ. బుధుడు మేషంలో 16.53లో నున్నాడు. ఇది చరరాశి కనుక 16.48 నుంచి 17.00 వరకు 85వ నాడీ అంశ "జ్వాల" అయింది. బుధుడు ఈ నాడీ అంశలో ఉన్నాడని తెలుసుకోవాలి.

ప్రస్తుత పుస్తకంలో చంద్రకళానాడి సంగ్రహానువాదం చేయడం జరిగింది. వివిధ లగ్నములకు వివిధ నాడీ అంశల



ఫలితములు పట్టిక విధానములో వ్రాశాను. జాతకుని యొక్క మేనమామ, మేనత్త, పినతండ్రి మొ॥ విషయముల మూల గ్రంధంలో వివరించినవి వ్రాయలేదు. ప్రస్తుత ప్రయోజనకారి కానిదని భావించి భవిష్య ఫలితములు, జాతకుని వివరములు మాత్రమే ప్రధానంగా వ్రాయడం జరిగింది.

గతంలో నా జ్యోతిష రచనలను ఆదరించినట్లే, దీనిని ఆదరిస్తారని భావిస్తున్నాను. జ్యోతిష శాప ప్రాభవం మరింత పెరగాలని, తెలుగులో మరిన్ని పుస్తకములు రావాలని, కోరుకుంటున్నాను.

విజయదశమి                                    భవదీయ

1996                                    **మేడవరపు సంపత్‌కుమార్**



# నాడీ గ్రంథాలు

"నాడీ" అనే పదానికి కొంత స్వల్పమయిన సమయం' అని అర్థము, అతి స్వల్పమయిన సమయమును ఆధారము చేసుకొని ఆసమయమునకు ఉన్న గ్రహస్థితినిబట్టి, ఆ జాతకునిపూర్తి వివరములు పుట్టిన స్థలం, పేరు ....... నుంచి మృతి, భవిష్యజన్మ వరకు వివరంగా తెలిపే జ్యోతిష గ్రంధానికే "నాడీగ్రంధ"మని పేరు. ఈ నాడీ గ్రంధాలు ఋషులచే చెప్పబడి, ఆయా ఋషుల నామధేయంతో ప్రఖ్యాతి పొందాయి.

ఈ గ్రంధాలలో అనేక జాతక చక్రములు ఉంటాయి. జాతకుని జాతక చక్రమును వాటిలో నుండి ఎంపిక చేసి దాని క్రింద ఈయబడిన వివరములతో సరిచూచిన విషయములన్నియు సరిపోతాయి.

ముందుగా కొన్ని నాడీ గ్రంధాలు ముద్రణ అయినవీ ముద్రణ కానివీ కొన్ని తెలియజేసి, ఆతరువాత వాటిగూర్చి వివరిస్తాను. ఈ నాడీ గ్రంధాలు ముఖ్యంగా ఎక్కువగా సంస్కృత భాషలోనూ, తమిళంలోనూ ఉన్నాయి కొన్ని తెలుగు, కన్నడ, పంజాబీలో కూడా ఉన్నట్లి తెలిసింది, కాని నేను చూడలేదు

**సంస్కృతంలో ఉన్నవి**

1) భృగునాడి 2) మార్కండేయనాడి
3) శుక్ర నాడి 4) అగస్త్యనాడి
5) సప్తర్షి నాడి 6) చంద్రకళా నాడి
7) భృగునంది నాడి 8) ధృవనాడి
9) నవనాడి 10) కుజనాడి.

**తమిళంలో ఉన్నవి**

1) శుక్ర పెరియనాడి 2) కక్కయర్ నాడి
3) స్కందర్ నాడి 4) కౌశికం (విశ్వామిత్ర, వశిష్ఠ సంవాద రూపమైనది)5) నందికేశ్వరనాడి.
6) కపిలనాడి.

ఒక రాశికి 30 డిగ్రీలు. 2గం॥ సమయం దీనిని ని॥లోనికి మారుస్తే 120 ని॥లు 7200 సెకెండ్లు వస్తాయి. 48 సెకెండ్లకు ఒక జాతకచక్రంగా విభజిస్తే ! లగ్నానికి ఖచ్చితంగా

150 రకాల జాతక చక్రాలు ఏర్పడతాయి. కనుకనే లగ్నం, హోరా, ద్రేక్కాణం, నవాంశ, వీటి ననుసరించి ఒకే లగ్నంలో గ్రహస్థితి ఒకేలా ఉన్నా వివిధరకాల ఫలితాలు ఏర్పడతాయి.

ఒక లగ్నానికి 500 రకాల చక్రాలున్న నాడీ గ్రంధాలు కూడా ఉన్నాయి.

1) భృగునాడి- దక్షిణ-ఉత్తర భారత దేశంలో ఎంతో ఖ్యాతి పొందింది. ఇది తాళపత్ర గ్రంథం.బొంబాయిలో ఒక ప్రచురణ సంస్థ 1940 ప్రాంతంలో కొన్ని జాతక చక్రాలతో "భృగునాడి" గ్రంధం సంస్కృత లిపిలో ప్రచురించింది. ఫలితాలు కూడా బాగా వచ్చేవి, అయితే అన్ని చక్రాలు అర్కదులో ఉండేవి కావు.

2) మార్కండేయనాడి- ఇది తమిళంలోకి అనువాదం చేయబడింది మద్రాసులోని రాయపేట హైరోడ్‌లో ఒకరివద్ద ఎగ్మోర్‌లో ఒక మొదలియార్ వద్ద ఉన్నాయి. పార్వతీదేవి మధ్యవర్తిగా, వశిష్ఠ, విశ్వామిత్ర సంవాదంగా ఇది ఉన్నది. ఇది చాలా ఖచ్చితంగా ఫలితాలు చెప్పినట్లు "ది ఎస్ట్రలాజికల్ మేగజైన్" సంపాదకుడు, ప్రసిద్ధ జ్యోతిష శాస్త్రవేత్త శ్రీ బివి. రామన్ 'My experience in Astrology" అనే గ్రంధంలో పేర్కొన్నారు. 'అగస్త్య నాడి' కూడా ఫలితాలు బాగా చెప్పినట్లు శ్రీ రామన్ చెప్పారు.

'ధృవనాడి' మద్రాసులోని ఓరియంటల్ మాన్యుస్క్రిపు లైబ్రరీలో 48 భాగాలుగా ఉంది. అన్ని లగ్నాలకూ మొత్తం శ్లోకాలు 2లక్షల 75వేలు ఇది చూసే విధానం కూడా చాలా విశిష్టంగా ఉంటుంది. దీనికి రాశినవాంశ కూడా కావాలి. రాశి లగ్నంతోబాటుగా, రాశిలో లగ్నం అంశలో వేసి 1) లగ్నాంశ 2) విత్తాంశ 3) విక్రమాంశ 4) సుఖాంశ 5) పుత్రాంశ 6) షష్ఠాంశ 7) కళత్రాంశ 8) రంధ్రాంశ 9) భాగ్యాంశ 10) కర్మాంశ 11) లాభాంశ 12) వ్యయాంశ చూడాలి.

ఉదా: ఒక జాతకుడు వృశ్చిక లగ్నంలో కుంభ నవాంశలో జన్మించినపుడు, రాశిలోని వృశ్చికం, అంశలో వేసి అక్కడ లగ్నాంశగా తరువాత ధనసులో గురు, శనులున్నపుడు గురువిత్తాంశ, శనివిత్తాంశగా పరిశీలించాలి ముందుగా లగ్నం, హోరా, ద్రేక్కాణం, నవాంశ. త్రింశాశ సరిపోవాలి. అప్పుడే అందులోని విషయాలు ఆ జాతకునికి ఖచ్చితంగా సరిపోతాయి. ఈ ధృవనాడి సూత్రాల ననుసరించి సత్యాచార్య ఋషి "సత్యసంహితానాడి" వ్రాశాడు, గురుపరంపరలో ధృవుడు జైమినికి, జైమిని గర్గఋషికి, గర్గ ఋషి వ్యాసునకు. వ్యాసుడు సత్యాచార్యునకు, సత్యాచార్యుడు శిష్యుడైన మణిత్థునకు చెప్పినట్లు అందులో వివరించబడినది.

ఈ సత్యాచార్యులు వరాహమిహిరుని కంటే (A B. 6 శతాబ్ది) ప్రాచీనుడు వరాహమిహిరుడు ఈ సత్యాచార్యుని ఎంతో గౌరవంగా, తన బృహజ్జాతకంలోఉల్లేఖించాడు.

ఆయుర్దాయ నిర్ణయంలో సత్యాచార్య మతమును వరాహమిహిరుదు ప్రశంసించాడు సత్యాచార్య బౌద్ధ సన్యాసియని కొందరి అభిప్రాయం

"నాడీ గ్రంధా"ల పేరుతో కొన్నిచోట్ల మోసం కూడా జరుగుతోంది. అప్పటికప్పుడు సాధారణ సులభమైన సంస్కృత భాషలో అనుస్టుప్ ఛందంలో శ్లోకం రచించి ఫలితాలు చెప్పేవారు కొన్ని చోట్ల ఉన్నారు

అయితే కొన్ని నాడీ గ్రంధాలు గతం వివరించినంతగా, ఖచ్చితంగా భవిష్యత్ జరగటంలేదు.

ఈ "నాడీ గ్రంధా"ల రహస్యం ఏమిటనేది ఒకసారి పరిశీలిస్తే, పూర్వం ఋషులు అనేక రకాల గ్రహ సంపుటులకు అనేక విధాలుగా మానవునికి కర్మ ఫలితాలు ఉంటాయని వీటిలో నిర్దేశించారు. అయితే ఇవి కేవలం దివ్యదృష్టితోనూ యోగశక్తితోనూ మాత్రమే వ్రాసినవి కావు గణితశాస్త్ర రీత్యా 3×3=9 అనేది ఎంత సత్యమో, ఈ గ్రహములు ఈవిధంగా ఈ లగ్నానికి ఉంటే ఫలితం ఇలా ఉంటుంది అనేది ఒక సిద్ధాంతం. ఇదే నాడి గ్రంధంలోని అసలు కీలకం.

కొన్ని గ్రంధాలు ఆప్రాంతాల అక్షాంశాల ననుసరించి లిఖించబడ్డాయి. అవి ఇక్కడివారి లగ్నాలకు సరిపోవు ఆప్రాంత అక్షాంశాలకు ఈ ప్రాంతపువారి జాతకాలు గుణించాలి. అపుడే అవి సరిపోతాయి ఇంకా తెలుసుకోవలసింది ఎంతో ఉంది విజ్ఞానం అభివృద్ధి అయ్యేకొలది వివిధ రకాల పద్ధతులు ఆవిష్కారమవుతాయి ఏమైనా "నాడీ గ్రంధా" ల ఆకర్షణ, ఫలితాలు కూడా ఎంతో విశిష్టమైనవి.

**150 నాడీ అంశలు**

| చర లగ్నం | డిగ్రీ–ని నుండి | డిగ్రీ–ని వరకు | స్థిర లగ్నం | ద్విస్వ లగ్నం | నాడీ అంశ |
|---|---|---|---|---|---|
| 1 | 0–0 | 0–12 | 150 | 76 | వసుధ |
| 2 | 0–12 | 0–24 | 149 | 77 | వైష్ణవి |
| 3 | 0–24 | 0–36 | 148 | 78 | బ్రాహ్మీ |
| 4 | 0–36 | 0–18 | 147 | 79 | కాలకూట |
| 5 | 0–48 | 1–0 | 146 | 80 | శంకరి |
| 6 | 1–0 | 1–12 | 145 | 81 | సుధాకర |
| 7 | 1–12 | 1–24 | 144 | 82 | సౌమ్య |
| 8 | 1–24 | 1–36 | 143 | 83 | సూర |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 9 | 1-36 | 1-48 | 142 | 84 | మాయ |
| 10 | 1-48 | 2-0 | 141 | 85 | మనోహర |
| 11 | 2-0 | 2-12 | 140 | 86 | మాధవి |
| 12 | 2-12 | 2-24 | 139 | 87 | మంజుస్వన |
| 13 | 2-24 | 2-36 | 138 | 88 | ఘోర |
| 14 | 2-36 | 2-48 | 137 | 89 | కుంభిని |
| 15 | 2-48 | 3-0 | 136 | 90 | కుటిల |
| 16 | 3-0 | 3-12 | 135 | 91 | ప్రభ |
| 17 | 3-12 | 3-24 | 134 | 92 | పరా |
| 18 | 3-24 | 3-36 | 133 | 93 | పయస్విని |
| 19 | 3-36 | 3-48 | 132 | 94 | మాల |
| 20 | 3-48 | 4-0 | 131 | 95 | జగతి |
| 21 | 4-0 | 4-12 | 130 | 96 | జర్ఝరి |
| 22 | 4-12 | 4-24 | 129 | 97 | ధృవ |
| 23 | 4-24 | 4-36 | 128 | 98 | ముసల |
| 24 | 4-36 | 4-48 | 127 | 99 | ముద్గర |
| 25 | 4-48 | 5-0 | 126 | 100 | పాశ |
| 26 | 5-0 | 5-12 | 125 | 101 | చంపక |
| 27 | 5-12 | 5-24 | 124 | 102 | దామిని |
| 28 | 5-24 | 5-36 | 123 | 103 | మహి |
| 29 | 5-36 | 5-48 | 122 | 104 | కలుష |
| 30 | 5-48 | 6-0 | 121 | 105 | కమల |
| 31 | 6-0 | 6-12 | 120 | 106 | కాంత |
| 32 | 6-12 | 6-24 | 119 | 107 | కాల |
| 33 | 6-24 | 6-36 | 118 | 108 | కరికర |
| 34 | 6-36 | 6-48 | 117 | 109 | క్షమ |
| 35 | 6-48 | 7-0 | 116 | 110 | దుర్ధర |
| 36 | 7-0 | 7-12 | 115 | 111 | దుర్భగ |
| 37 | 7-12 | 7-24 | 114 | 112 | విశ్వ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 38 | 7-24 | 7-36 | 113 | 113 | విశీర్ణ |
| 39 | 7-36 | 7-18 | 112 | 114 | విహ్వల |
| 40 | 7-48 | 8-0 | 111 | 115 | అనిల |
| 41 | 8-0 | 8-12 | 110 | 116 | భీమ |
| 42 | 8-12 | 8-24 | 109 | 117 | సుఖప్రద |
| 43 | 8-24 | 8-36 | 108 | 118 | స్నిగ్ధ |
| 44 | 8-36 | 8-48 | 107 | 119 | సోదర |
| 45 | 8-48 | 9-0 | 106 | 120 | సురసుందరి |
| 46 | 9-0 | 9-12 | 105 | 121 | అమృతప్రాశిని |
| 47 | 9-12 | 9-24 | 104 | 122 | కాల |
| 48 | 9-24 | 9-36 | 103 | 123 | కామదృక్వర్ణి |
| 49 | 9-36 | 9-48 | 102 | 124 | గంభీర |
| 50 | 9-48 | 10-0 | 101 | 125 | కుండిని |
| 51 | 10-0 | 10-12 | 100 | 126 | కాంత |
| 52 | 10-12 | 10-24 | 99 | 127 | విష |
| 53 | 10-24 | 10-36 | 98 | 128 | విషనాశినీ |
| 54 | 10-36 | 10-48 | 97 | 129 | నిర్మద |
| 55 | 10-48 | 11-0 | 96 | 130 | శీతల |
| 56 | 11-0 | 11-12 | 95 | 131 | నిమ్న |
| 57 | 11-12 | 11-21 | 94 | 132 | ప్రీత |
| 58 | 11-24 | 11-36 | 93 | 133 | ప్రియవివర్ధిని |
| 59 | 11-36 | 11-48 | 92 | 134 | మానద |
| 60 | 11-48 | 12-0 | 91 | 135 | దుర్భగ |
| 61 | 12-0 | 12-12 | 90 | 136 | చిత్ర |
| 62 | 12-12 | 12-24 | 89 | 137 | విచిత్ర |
| 63 | 12-24 | 12-36 | 88 | 138 | చిరజీవిని |
| 64 | 12-36 | 12-48 | 87 | 139 | భూప |
| 65 | 12-48 | 13-0 | 86 | 140 | గదాహర |
| 66 | 13-0 | 13-12 | 85 | 141 | నాల |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 67 | 13-12 | 13-24 | 84 | 142 | గాలవీ |
| 68 | 13-24 | 13-36 | 83 | 143 | నిర్మల |
| 69 | 13-36 | 13-48 | 82 | 144 | నది |
| 70 | 13-48 | 14-0 | 81 | 145 | సుధ |
| 71 | 14-0 | 14-12 | 80 | 146 | మృతాంశుగ |
| 72 | 14-12 | 14-24 | 79 | 147 | కాళి |
| 73 | 14-24 | 14-36 | 78 | 148 | కాళికా |
| 74 | 14-36 | 14-48 | 77 | 149 | కలుషాంకుర |
| 75 | 14-48 | 15-0 | 76 | 150 | త్రైలోక్య |
| 76 | 15-0 | 15-12 | 75 | 1 | మహామాయ |
| 77 | 15-12 | 15-24 | 74 | 2 | సుశీతల |
| 78 | 15-24 | 15-36 | 73 | 3 | సుఖద |
| 79 | 15-36 | 15-48 | 72 | 4 | సుప్రభ |
| 80 | 15-48 | 16-0 | 71 | 5 | శోభ |
| 81 | 16-0 | 16-12 | 70 | 6 | శోభన |
| 82 | 16-12 | 16-24 | 69 | 7 | శివద |
| 83 | 16-24 | 16-36 | 68 | 8 | శివ |
| 84 | 16-36 | 16-48 | 67 | 9 | బల |
| 85 | 16-48 | 17-0 | 66 | 10 | జ్వాల |
| 86 | 17-0 | 17-12 | 65 | 11 | గద |
| 87 | 17-12 | 17-24 | 64 | 12 | గాధ |
| 88 | 17-24 | 17-36 | 63 | 13 | నూతన |
| 89 | 17-36 | 17-48 | 62 | 14 | సుమనోకర |
| 90 | 17-48 | 18-0 | 61 | 15 | సోమవల్లి |
| 91 | 18-0 | 18-12 | 60 | 16 | సోమలత |
| 92 | 18-12 | 18-24 | 59 | 17 | మంగళ |
| 93 | 18-24 | 18-36 | 58 | 18 | ముద్రిక |
| 94 | 18-36 | 18-48 | 57 | 19 | సుధ |
| 95 | 18-48 | 19-0 | 56 | 20 | మేలా |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 96 | 19-0 | 19-12 | 55 | 21 | అపవర్గ |
| 97 | 19-12 | 19-24 | 54 | 22 | పశ్యత |
| 98 | 19-24 | 19-36 | 53 | 23 | నవనీత |
| 99 | 19-36 | 19-48 | 52 | 24 | నిశాచర |
| 100 | 19-48 | 20-0 | 51 | 25 | నివృతి |
| 101 | 20-0 | 20-12 | 50 | 26 | నిర్గత |
| 102 | 20-12 | 20-24 | 49 | 27 | సారా |
| 103 | 20-24 | 20-36 | 48 | 28 | సామగ |
| 104 | 20-36 | 20-48 | 47 | 29 | సమద |
| 105 | 20-48 | 21-0 | 46 | 30 | సామ |
| 106 | 21-0 | 21-12 | 45 | 31 | విశ్వంభర |
| 107 | 21-12 | 21-24 | 44 | 32 | కుమారి |
| 108 | 21-24 | 21-36 | 43 | 33 | కోకిల |
| 109 | 21-36 | 21-48 | 42 | 34 | కుంజరాకృతి |
| 110 | 21-48 | 22-0 | 41 | 35 | ఇంద్ర |
| 111 | 22-0 | 22-12 | 40 | 36 | స్వాహా |
| 112 | 22-12 | 22-24 | 39 | 37 | స్వధా |
| 113 | 22-24 | 22-36 | 38 | 38 | వహ్ని |
| 114 | 22-36 | 22-48 | 37 | 39 | పీత |
| 115 | 22-48 | 23-0 | 36 | 40 | యక్షి |
| 116 | 23-0 | 23-12 | 35 | 41 | అచలప్రభ |
| 117 | 23-12 | 23-24 | 34 | 42 | సారిణి |
| 118 | 23-24 | 23-36 | 33 | 43 | మధుర |
| 119 | 23-36 | 23-48 | 32 | 44 | మైత్రి |
| 120 | 23-48 | 24-0 | 31 | 45 | హరణి |
| 121 | 24-0 | 24-12 | 30 | 46 | హారిణి |
| 122 | 24-12 | 24-24 | 29 | 47 | మరుత |
| 123 | 24-24 | 24-36 | 28 | 48 | ధనంజయ |
| 124 | 24-36 | 24-48 | 27 | 49 | ధనకరి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 125 | 24-48 | 25-0 | 26 | 50 | ధనద |
| 126 | 25-0 | 25-12 | 25 | 51 | కచ్ఛప |
| 127 | 25-12 | 25-24 | 24 | 52 | అంబుజ |
| 128 | 25-24 | 25-36 | 23 | 53 | ఈశాని |
| 129 | 25-36 | 25-48 | 22 | 54 | శూలిని |
| 130 | 25-48 | 26-0 | 21 | 55 | రౌద్రి |
| 131 | 26-0 | 26-12 | 20 | 56 | శివకరి |
| 132 | 26-12 | 26-24 | 19 | 57 | కళ |
| 133 | 26-24 | 26-36 | 18 | 58 | కుంద |
| 134 | 26-36 | 26-48 | 17 | 59 | ముకుంద |
| 135 | 26-48 | 27-0 | 16 | 60 | పరిత |
| 136 | 27-0 | 27-12 | 15 | 61 | కదళి |
| 137 | 27-12 | 27-24 | 14 | 62 | స్మర |
| 138 | 27-24 | 27-36 | 13 | 63 | బసిత |
| 139 | 27-36 | 27-48 | 12 | 64 | కొదల |
| 140 | 27-48 | 28-0 | 11 | 65 | కోకిలాంశ(పాప |
| 141 | 28-0 | 28-12 | 10 | 66 | కామిని |
| 142 | 28-12 | 28-24 | '9 | 67 | కలశోద్భవ |
| 143 | 28-24 | 28-36 | 8 | 68 | వీరప్రసూ |
| 144 | 28-36 | 28-48 | 7 | 69 | సంగర |
| 145 | 28-48 | 29-0 | 6 | 70 | సత్యజ్ఞ |
| 146 | 29-0 | 29-12 | 5 | 71 | శతావరి |
| 147 | 29-12 | 29-24 | 4 | 72 | స్రగ్వి |
| 148 | 29-24 | 29-36 | 3 | 73 | పాతాళిని |
| 149 | 29-36 | 29-48 | 2 | 74 | నాగపంకజ |
| 150 | 29-48 | 30-0 | 1 | 75 | పరమేశ్వరి |

॥ ఓం అశ్వలాయ నాయనమః ॥

# ॥ మేష లగ్నం ॥

## 1. చంపక నాడీ అంశ

శ్లో॥ మేషలగ్నే చంపకాంశే మేషాంశేతు ప్రజాయతే
విప్రజన్మా సుఖీనిత్యం సీమంత తనయోభవేత్
అధవాచ తృతేయఃస్యాత్ జ్యేష్ఠభాతృవినాశవాన్
చంపకాంశే పూర్వభాగే గురుత్రింశాంశకేతథా
పూర్వపశ్చిమ వీధీషు చోత్తరేతు ప్రజాయతే॥

2378-2379

తా॥ మేష లగ్నమునందు, మేషనవాంశలో చంపకాంశలోజన్మించిన జాతకుడు బ్రాహ్మణ వంశములో మొదటి లేక మూడవ సంతానముగా జన్మించి బహు సుఖములు పొందును. అన్నగారు ఉండరు. చంపక నాడీఅంశలో మొదటి భాగమునందు గురుత్రింశాంశలో జన్మించిన జాతకుడుతూర్పు పడమర వీధిలో ఉత్తరదిశగా ముఖముగల ఇంటిలో జన్మించినవాడగును.

గురు శనులు కలసి కర్కాటములో నుండి మీననవాంశను పొందినచో జాతకుడు 26 సం॥నుండి అనేక సుఖములు ఉద్యోగ లాభములు, ధనము పొందుతాడు చర లగ్నములకు (మేషం-కర్కాటం-తుల-మకరం) 8వ రాశ్యాధిపతి దశా కాలములో గొప్పవారితో స్నేహము, పరిచయములు కలుగుతాయి. 6- 8 అధిపతుల అంతర్ధశాకాలములోనూ, అష్టమాధిపతి దశలో చంద్రాంతర్ధశలోనూ కష్టములు, నష్టములు, మనోవిచారం కలుగుతాయి. తండ్రి యొక్క సోదరులకు అరిష్టం, అల్సర్, మూత్ర సంబంధ వ్యాధులతో జాతకుడు బాధ పొందుతాడు, తగిన గ్రహ శాంతులు చేయాలి. 2680-2683

భాగ్యాధిపతి కర్కాటక లగ్నమందున్న జాతకుడు గొప్ప దానగుణము కలవాడగును చరలగ్నములో చంపకాంశలో గురు త్రిశాంశలో జన్మించిన జాతకుడు మధ్యమ దేహము గలవాడు, రూపవంతుడు ప్రసన్నమైన ముఖ నేత్రములు కలవాడు, అదృష్టవంతుడు, రాజయోగముకలవాడు, ధర్మాత్ముడు, అనేక భాషలు తెలిసినవాడు, మితభాషి, ఇంగిత జ్ఞానము కలవాడు, దేవబ్రాహ్మణభక్తి కలవాడు ఈశ్వరప్రియుడు అగును 2684-2689

లగ్నాధిపతి ద్వితీయములో నుండి చతుర్ధాధిపతి , లగ్నము నుండి కేంద్ర స్థానములలోనున్న జాతకుడు జీవితాంతము సౌఖ్యము పొందును, తృతీయాధిపతి లగ్నాధిపతితో కలిస్తే కనిష్ఠ సోదరులుండే అవకాశం లేదు.

చంద్రుడు ఇంద్రనాడీ అంశలో 21° 48' to 22° 00' ఉన్నట్లయితే జాతకుడు శివ కేశవుల భక్తుడు, మతకార్యక్రములలో పాల్గొనువాడు, వ్యవసాయము, పశువులు, భూములు వీటివల్ల లాభము పొందువాడు అగును. లాభాధిపతి భాగ్యస్థానమందున్న ద్వితీయ దశలో జాతకునికి ఉపనయనము జరుగుతుంది

దశమాధిపతి ఉన్న నవాంశ రాశిలో గురుడు సంచార కాలములో అచ్చటకు వచ్చినపుడు లేదా దాని త్రికోణ రాశులలో గురుడు సంచరించినపుడు జాతకునికి వివాహమగును. వధువు దక్షిణదిశగాగాని, ఆగ్నేయ దిశనుండిగాని వచ్చును

## పుష్కర నవాంశలు

ఈ క్రింది పేర్కొన్న పట్టిక ననుసరించి రాశి చక్ర మందున్న గ్రహములు, నవాంశ చక్రములులో ఆయా రాశులలో నున్నపుడు ఆ గ్రహము పుష్కర నవాంశను పొందినట్లుగా భావించవలయును, పుష్కర నవాంశను పొందిన గ్రహములు జీవితాంతము సౌఖ్యము నిచ్చును

| రాశి | – | నవాంశ |
|---|---|---|
| మేషం | – | తుల |
| వృషభం | – | మీనం |
| మిధునం | – | మీనం |
| కర్కాటకం | – | కర్కాటకం |
| సింహం | – | తుల |
| కన్య | – | మీనం |
| తుల | – | మీనం |
| వృశ్చికం | – | కర్కాటకం |
| ధనుస్సు | – | ధనుస్సు |
| మకరం | – | వృషభం |
| కుంభం | – | వృషభం |
| మీనం | – | కన్య |

మేష- మిధన- సింహ-వృశ్చిక-మకర-కుంభ నవాంశములలోనున్న గ్రహములు పుష్కరాంశములు పొందవు.

**వాహనములు:-** లగ్న-చతుర్థాధిపతులకు కలయిక గాని, దృష్టిసంబంధముగాని కలిగినచో లేదా వీరికి 10-11 అధిపతుల దృష్టిగాని, యుతిగాని ఏర్పడినచో జాతకుడు, ఆయా దశాంతర్దశలలో గొప్పవాహనములను పొందును.

"కర్మేశ లాభేశ్వర యోగదృష్ట్యాః
తేషాంతు కాలే చతురంగయానంః -2700

ద్వితీయాధిపతి దశలో, అష్టమాధిపతి నవాంశరాశిలో శని గోచారరీత్యా సంచారము సలిపినపుడు, తల్లికి అరిష్టము కలుగును.

చంపక నాడీఅంశను పొందిన చరలగ్న జాతకుడు మేష-వృషభ రాశుల చివరిభాగంలో గురుని సంచారము వలన, మరియు మిధున గురుని సంచారము వలన భాగ్యవృద్ధిని పొందును.

"మిధునే బహు భాగ్యం స్యాత్
చంపకాంశే న సంశయః" -2702

కుజుదున్న రాశ్యాధిపతిని గురుడు పొంది అది లగ్న కేంద్ర స్థానమయినచో జాతకుని తండ్రి 4గురు లేక 5గురు సోదరులు కలవాడని తెలియవలయును.

శని, మేషలగ్న జాతకులకు. చంపకనాడీ అంశను పొందినచో జాతకుని మేనమామ గుణవంతుడు, ధనవంతుడు అగును

మేషలగ్న జాతకులకు రెండవ, మూడవ దశలు శుభఫలితాలనిస్తాయి, కాని తల్లి తండ్రికిగాని, జాతకుని భార్యా పుత్రులకుగాని మంచిదికాదు, తండ్రికి కూడా ప్రయాణములలో ప్రమాదం జరుగవచ్చు.

చంపక నాడీఅంశ జాతకులకు, శని, వృషభంలో సంచరించినపుడు, రవి సింహరాశిలోకి వచ్చినపుడు పితృమారకము జరుగవచ్చు. ఈ అంశ జాతకులకు రవి-కుజులు యుతి పొందినా, దృష్టిపడినా పుత్ర పుత్రికా సంతానము ఎక్కువగా కలుగుతుంది పుత్రస్థానాధిపతి అయిన రవిమిధున నవాంశను పొంది కుజునిచే చూడబడినచో, జాతకుడు కవల పిల్లలను పొందును. బుధునిపై కూడా కుజదృష్టి ఉంటే మంచిది -2708

రవి-బుధులు 10లో ఒకే డిగ్రీలలో నున్నచో, వారిపై కుజదృష్టి ఏర్పడినచో జాతకుడు మిక్కిలి నల్లని శరీరము వాడగును నిత్యభోగి అగును.

దశమంపై గురుని దృష్టి ఉన్నచో మూడవ దశలో ఉత్తరార్ధము శుభఫలితాల నిస్తుంది 40 సం॥ము నుంచి భాగ్యవృద్ధి కలుగుతుంది. 4వ దశలో గొప్పధనవంతుడగును.

భృగునాడీ సంప్రదాయము ననుసరించి మేషలగ్న జాతకులకు చతుర్ధము పాపాక్రాంతమైననూ, పాపదృష్టమైననూ, జాతకుడు మంచి ఉద్యోగస్తుడు, ధనవంతుడు అగును.

## 2. ధనద నాడీ అంశ

మేషలగ్నం (చరరాశి) ధనద నాడీ అంశలో (ప్రథమ భాగం)లో జన్మించిన జాతకుడు జన్మతఃశూద్రుడు, తల్లి దండ్రులకు 7వ సంతానము అగును. శృంగార సంబంధమయిన భావోద్రేకము అధికముగా గలవాడు. నల్లనివాడు భారీ శరీరము కలవాడు అగును. మధురముగా మాట్లాడును, విద్యలో మంచి నేర్పరి. అతని జన్మము ఒక చిన్న గ్రామములో జరుగును. అది కొండప్రాంతము అయి ఉండును. ఇది ధనద నాడీ అంశలో ప్రథమభాగ ఫలము.

ధనద నాడీఅంశ ద్వితీయభాగమందు జన్మించినవాడు పర్వతములందు ఆయా సమీప ప్రాంతములందు జన్మించును వ్యాపారస్తుల కుటుంబములో, సముద్రతీర ప్రాంతములందు దక్షిణ-ఉత్తరవీధిలో తల్లిదండ్రులకు, రెండవ కుమారునిగా జన్మించును. వాత రోగములు గలవాడగును. ఇద్దరుసోదరిలు కలవాడై ఒకామెభర్త బహుకాల జీవితుడగును

ప్రథమ భాగమందు జన్మించినచో చంద్రుడు కేంద్రములందుగాని 11లో గాని యున్నఎడల తల్లి బహుకాలము జీవించును.

ద్వితీయ భాగమందు జన్మించి చంద్రుడు పైనచెప్పిన రాశులలో నున్నచో 22-23 సం॥లో మాతృవియోగము కల్గును.ప్రథమభాగం - చంద్రుడు పంచమమందున్న స్త్రీ సంతానము అధికముగా కల్గును.

ఇతని కుమారులు జాతకునియొక్క పూర్వకర్మ వల్ల దుఃఖతులగుదురు దోషపరిహారార్థము, హరిద్రాలింగార్చన (పసుపుతో చేసిన లింగం) చేయవలయును.

బాల్యము, యౌవనము, బహు కష్టములతో గడచును తండ్రి మరణానంతరముగాని, భాగ్యాధిపతి అయిన గురు దశలోగాని, ధనవృద్ధి కలుగును, గ్రామమలో వ్యవసాయం కలవాడగును

ద్వితీయ భాగములో ధనద నవాంశలో జన్మించిన వారు, జన్మతః ధనవంతులగుదురు. వీరికి ప్రథమభార్య వియోగానంతము, ద్వితీయ భార్యయందు గుణవంతులయిన పుత్రులు కలుగుదురు. స్వయంకృషితో గొప్పధనవంతులగుదురు.

ఇతడు ద్రవపదార్థములు, లోహములు వీటి వ్యాపారములో అధికముగా సంపాదించును 30సం॥లు దాటిన పిదప గొప్ప కీర్తిపొందును 31వ సం॥లో తండ్రి సోదరులకు అరిష్టము కలుగును చంద్రరాశినుంచి 4వ రాశ్యాధిపతి దశలో గాని 8వ రాశ్యాధిపతి దశలో గాని పితృమరణము జరుగును. 8వ రాశినాధుని దశ జరుగునపుడు, శని గోచారరీత్యా 12వ స్థానమునకు వచ్చినచో భాగ్యనాశనము కలుగును. ఆదాయముకంటే, వ్యయము అధికమగును తండ్రికిగల ముగ్గురు సోదరిలలో ఒకరు వైధవ్యముచే బాధను పొందుదురు.

గర్గమహాముని మతరీత్యా ఈ నాడీఅంశ జాతకులు సంతానము ఆలస్యముగా పొందుదురు. ఒకరు మృతులై పుట్టుదురు ఒక కుమార్తె బహుకాలము జీవించును ఇద్దరు లేక ముగ్గురు భార్యలుండు అవకాశము కలదు ఉదరకోశ వ్యాధులుండును

ధనద నాడీఅకశ ధ్రమభాగలో జన్మించిన వారికి రాహుదశ యోగించదు. భార్యావియోగము, మధ్య వయసులో పునర్వివాహము, తండ్రి సోదరులకు అరిష్టముకలుగును.

ద్వితీయభాగలో జన్మించిన వారికి రాహుదశ బాగా యోగిస్తుంది.

చంద్రదశలో కురుపులు, శస్త్రచికిత్స మొ॥గు బాధలుంటాయి.

గురుడు గోచారరీత్యా వృషభమందు సంచరించినపుడు ఇంటియందు శుభకార్యములు జరుగును. వ్యాపారమునందు, ఉద్యోగమునందు అభివృద్ధి కల్గును. 37 సం॥నందు విదేశీ వస్తు లాభం జరుగును.

4వ దశలో (క్షేమతారదశ) 5వ అధిపతియొక్క అంతర్దశ బాగాయోగిస్తుంది ప్రయాణములు చేయడం జరుగుతుంది. ద్రవపదార్థములవల్ల లాభం.

## 3. సమాంశ

సమాంశ నాడీఅంశ ప్రథమభాగమందు జన్మించిన జాతకుడు వ్యాపారస్తుల కులమునందు జన్మించినవాడు, పవిత్ర పుణ్యస్థలములో విష్ణు దేవాలయ ప్రాంతమున జన్మించును. తూర్పు-పడమర వీధిలో ఉతత్తర ముఖము ఇంటిలో పుట్టినవాడగును కుటుంబములో 8 లేక 9వవాడు, మంచి దేహదారుఢ్యము కలవాడు దేవ-బ్రాహ్మణ భక్తికలవాడు, కపటమైన మనసుకలవాడు, మధురముగా మాట్లాడువాడు అగును బుధుడు, కుజునిచే చూడబడినచో సోదరులు (తమ్ములు) ఉండరు. ఇద్దరు అన్నలుందురు. ఒక సోదరి ఉండును.

సమాంశ ద్వితీయభాగలో జన్మించిన (అన్న) జ్యేష్ఠభ్రాత ఉండడు. 4గురు సోదరిలు ఉందురు ఇతడు శూద్రకులమునందు ఉత్తర దక్షిణ వీధిలో ఉత్తర ముఖముగల ఇంటిలో జననమొందును. గురుడు, రవినిచూచి కుంభనవాంశను పొందినచో, లేదా రాహువుతో గురుడు కలసిన.ూ తమ్ములుగాని, చెల్లెళ్ళుగాని ఉండరు.

యౌవనమందు కొంత ఋణగ్రస్తుడు అగును.మంచి మేధావి, అనర్గళముగా ఉపన్యసించువాడు.

చంద్రుడు మిధున నవాంశను పొంది గురునిచేచూడబడినచో రాహుదశ శుక్రాంతర్దశలో స్వతృహ యోగము కలుగును. వ్యాపారమందు ధనలాభము. ఉద్యోగమునందు ఉన్నతి పొందును. ఆదాయము ఎక్కువగా ఉన్ననూ, వ్యయము కూడా ఎక్కువగా చేయును.

రాహుదశలో రవ్యంతర్దశలోగాని విపత్తారదశలో శని వృశ్చికమందు సంచరించినపుడు జాతకుని అన్నకు మంచిది కాదు

ద్వితీయాధిపతి అయిన శుక్రుడు, గురుని వీక్షణము పొంది తులాంశను పొందినచో వివాహమగును.

క్షేమతార దశాకాలమందు జాతకుని కుటుంబము లక్ష్మీకటాక్షము పొందును 3సం॥రము తరువాత గొప్ప ధనలాభము సౌఖ్యము పొందును.

చరరాశియందు జన్మించి, షష్ట్యంశకూడా చరరాశియైనచో జాతకుడు మధ్యవయసులో యోగము పొందును.

ప్రత్యక్తార దశయందు శని కుంభ నవాంశగతుడై జన్మమందుండినచో. 45-50 సం॥నందు దేహత్యాగము చేయును. లేదా స్వజనులచే పరిత్యక్తుడగును.

రవి 5లో ఉండి గురునచే చూడబడినచో, క్షేమతార దశలో శుక్రాంతరము నందు పుత్రజననము జరుగును.

గురుదశ గురుఅంతర్ధశ బాగా యోగిస్తుంది. అన్నగారి కుమారుని వివాహము జరుగుతుంది. ఆభరణములు కొనడం రత్నలాభం కలుగుతుంది.

షష్ఠాధిప దశాసంధికాలమందు బాధకగ్రహభుక్తిలో వాతరోగములు ఏర్పడతాయి. అష్టమాధిపతి నవాంశ రాశిని శని గోచారరీత్యా వచ్చినపుడు లేదా, దానికి 5-9 రాశుల్లో శని వచ్చినపుడు 64సం॥లో జాతకుడు అపమృత్యు భయం పొందును విష్ణుసహస్రం జపించిన దోషనివారణ యగును. 74సం॥లో ఉత్తరాయణమునందు, రవి మకర కుంభ మీనములు సంచరించునపుడు బహుళ దశమినాడు రాత్రియందు దేహత్యాగము చేయును.

## 4. మంగళాంశ

మేషలగ్నం మంగళ నాడీ అంశ పూర్వభాగమందు జన్మించినవారు శూద్రజాతికి చెందినవారై కుటుంబము 7వ లేదా 9వ వారుగా జన్మించి సుఖజీవితమును గడుపుతారు. నదీ ప్రాంతమందు జనన మొందిన వీరు పట్టణంలో నివశిస్తారు.రవి నుండి దశమంలో శనియుండి, అష్టమాధిపతి షష్ఠస్థానంలో ఉంటే జాతకుని తండ్రి దుర్బలుడు, కోపిష్ఠి, దరిద్ర బాధ ననుభవించువాడు, శివానుగ్రహము కలవాడు, పశ్చాత్తాపము చెంది దేవబ్రాహ్మణులను పూజించువాడు అగును తాంత్రి కులనిన మిక్కిలి ఇష్టము కలవాడగును. ఒకేసోదరుడుండును.

భాగ్యాధిపతి అయిన గురుడు భాగ్యస్థానమందున్నచో జాతకుడు గొప్పధనవంతుడగును. శివభక్తుడై, తాంత్రికులనిన ఇష్టము గలవాడగును. చెరువులు, బావులు త్రవ్వించి అనేకమంది స్నేహితులుగలవాడగును.

11లోనున్న చంద్రుని, కుజుడు చూచినచో, వీరితో శుక్రుడు కూడినా, చూచినా బాలారిష్టదోషము కలుగును వీరికి ఉదరవ్యాధులు, చర్మవ్యాధులు బాల్యమందు బాధించును. గురుడు స్థిరమిత్ర రాశులలో శనితో కలిసియున్న బాలారిష్టదోషం లేదు

గురుడు సింహరాశిపై దృష్టిఉన్నచో మంగళాంశ ప్రధమభాగమందు జన్మించిన వారికి ఐశ్వర్యము కలుగును. ద్వితీయభాగమందు జన్మించిన వారికి దరిద్రము కలుగును

మొదటి 8సం॥లు బాల్యం బాగా గడుస్తుంది. తండ్రికి భాగ్యయోగం కలుగుతుంది 9సం॥ము మానసికాందోళన కలుగజేస్తుంది 2వదశ చివరిలో సోదర జననం. 3వ దశ మధ్యలో ధనవృద్ధి, విద్యాయోగం కలుగుతాయి. 2-3-6-9-12 దశలు బాగుంటాయి ఇతడు 3 భాషలలో పండితుడగును చంద్రుడు సింహ నవాంశలో నున్నచో, లగ్నం కన్యానవాంశ అయినపుడు జాతకుడు ఉత్తరదిశనుండి భార్యను పొందును

మేషలగ్న జాతకులకు ఈ క్రింది 3లక్షణములుపట్టినచో వివాహ విషయంలో ఆలస్యం లేదా ఇబ్బందులు కలుగుతాయి.

1- శని కుంభస్థితి

2- గురుడు సింహంలో ఉండి మేష నవాంశను పొందడం

3- లగ్నం వృశ్చిక నవాంశలో పడడం

శుక్రుడు మీన నవాంశను పొందిన జాతకుడు ఎర్రటి భార్యను పొందును వివాహానంతరము భాగ్యవృద్ధికల్గుతుంది.

కుజుడు కర్కాటక రాశిలో నుండి, మీన నవాంశను పొందినచో, జాతకుని మావగారు ఇద్దరు భార్యలు కలవాడగును. మేనమామ ధనవంతుడై ఉండును.

మంగళనాడీ అంశ ద్వితీయ భాగమందు జన్మించినవారు. 2. సోదరిలు 3 సోదరులు కలవాడగును. ఇతడు ఉత్తరదక్షిణ వీధిలో పశ్చిమ ముఖముగల ఇంటిలో జన్మించినవాడగును. నల్లని దేహము గలవాడై బ్రాహ్మణకులములో రెండవవాడుగా జన్మించును.

## 5. అచలాంశ

ఈ అచలాంశకే, ప్రభాంశయనీ, వికటాంశయనీ నామాంతరములు కలవు. శని 6వ స్థానములో నున్నచో తల్లియొక్క సోదరులు దీర్ఘాయువు గలవారగుదురు. (కారణమేమనగా మాతృస్థానమైన చతుర్థమునకు సోదర స్థానము జాతకుని 6వ స్థానమగుచున్నది.)

గురుడు ప్రభానాడీ అంశయందున్న జాతకుని 19-20 సం॥లో తల్లిదండ్రులకు

గురుడు కన్యారాశిలో సంచరించినపుడుగాని, వక్రించినపుడుగాని జాతకుని ఉపనయనము జరుగును.

మాతృస్థానాధిపతి, కారకుడు అయిన చంద్రుని యొక్క దశా చివరిభాగమునందు తల్లికి అనారోగ్యం, అరిష్టం, అష్టమమందు రాహువుగాని, కేతువుగాని యుండివీరి పై శనిదృష్టి యున్నచో
మహారోగముచేగాని చివరి దశలో దుర్గతి వలన గాని మరణించును. వీరికి కుజ దశ చివరి భాగము. రాహుదశలో రాహ్వాంతర్దశ అపమృత్యుభయం కలిగించును వీరి ఆయుర్దాయము 45 సం॥లు.

### 6. కుటిలాంశ

ఈ నాడీ అంశయందు జన్మించినవాడు శూద్రుడు. జ్యేష్ఠ సోదర సోదరిలు ఉందరు. సుఖప్రదమైన జీవితం గడుపును. ఒక తమ్ముడుగాని చెల్లెలు గాని ఉండును తండ్రి దూర దేశమందు మరణించును.

రవి, శనినవాంశలోనూ, చంద్రుడు కుటిలాంశలోనూ ఉన్నచో జాతకుడు తల్లి దండ్రులకు ఆలస్యముగా పుట్టిన వాడని తెలియవలెను.

కుటిలాంశ ప్రధమభాగమందు జన్మించినవాడి సోదరుడు పాపకర్మలు చేయువాడు అగును. 8లో గాని రాహువు వుండి మీనంలో శుక్రుడు మిధునంలో శని ఉన్నచో అట్టి జాతకుడు తండ్రికి ఊర్ధ్వక్రియలు చేయడు.

చంద్రుడు కుంతలాంశలో ఉండి శని–కుజులదృష్టి పొందినచో జాతకుని కుమారుని యొక్క వివాహము ఇబ్బందులు కలిగించును.

సప్తమాధిపతి దశ వివాహాది శుభకార్యములు కలిగించును.

కుటిలాంశ ద్వితీయ భాగమందు జన్మించిన మంచి ధనవంతుడగును

భాగ్యాధిపతి శుభులతో కలసిన అష్టకవర్గునందు ఎన్ని బిందువులు పొందెనో అంతమంది సంతానము కలుగును. సౌందర్యవతి అయిన కుమార్తె కలుగును.

పంచమాధిపతి అయిన రవి. శుక్ర నవాంశను పొందినచో ఏకసంతానము కలుగును.

"అసితాంశే సుతాధీశే
కాక వంధ్యా పతిః సుఖీ ॥

మేషలగ్నమందు జన్మించి, దశమంలో రవి యుండి. అట్టి రవి కన్యానవాంశను పొందినచో జాతకుడు స్వతంత్ర జీవనము సాగించి గొప్ప ధనవంతుడగును. సోదరుని కుటుంబము కూడా పోషించును.

శని మకరరాశి సంచారకాలంలో జాతకుని తల్లికి అనారోగ్యము-అరిష్టము

గోచార గురుడు 3వ పర్యాయం మీనంలో సంచరించునపుడు మేషలగ్న జాతకులకు ధనవృద్ధి కలుగుతుంది.

"యే గ్రహా జన్మకాలే తు
యస్మిన్ రాశౌ స్థితిం గతాః ।
తస్మిన్ రాశౌ దశారంభే
గతాస్తే శుభదాయినః ॥- 2512

తా॥ గ్రహదశ ప్రారంభమగునపుడు, జన్మరాశిలో ఆ గ్రహము, ఆ రాశిలో సంచరించినచో ఆ దశయోగించును.

భాగ్యాధిపతిగాని, లాభాధిపతిగాని పొందిన నవాంశ రాశిని గోచార గురుడు సంచరించునపుడు జాతకుడు, ఉద్యోగము, ధనవృద్ధి, సౌఖ్యము పొందుతాడు.

కుటిలాంశ జాతకులకు 5వదశ చివరి సమయమున జాతకుని భార్యకు అనారోగ్యము, అరిష్టము చేయును.

చతుర్థాధిపతి దశలో, శని అంతర్దశలో కుటుంబ పెద్దకు మృత్యుకాలము. బుధాంతర్దశలో ధనవృద్ధి, సంతాన రీత్యా సంతోషము, సుఖము, కీర్తి ప్రతిష్టలు కలుగుతాయి.

చంద్రదశలో శుక్రాంతర్దశ మేషలగ్న కుటిలాంశ జాతకులకు మంచిది

"లగ్నాధిప దశాకాలే భాగ్యాధిపతి భుక్తిషు
రాజామాత్య ప్రసాదేన ధనలాభం వినిర్ది శేత్ ॥
2560

తా॥ లగ్నాధిపతి దశలో , భాగ్యాధిపతి అంతర్దశ జరుగునపుడు పదవీయోగం. ధనలాభములు కలుగుతాయి. గృహములో శుభకార్యములు జరుగుతాయి.

చతుర్థాధిపతి దశలో జాతకుడు గృహము పొందుతాడు. అయితే చతుర్థాధిపతి చతుర్థంలో ఉండాలి, గృహ నిర్మాణం జరిగితీరుతుంది. లేదా కొనవచ్చు.

గోచారరీత్యా శని, కుంభ రాశిలో సంచరించునపుడు కుమార్తెకు మంచిదికాదు. జపశాంతులు ఆచరించాలి.

చంద్రుడు వృషభ రాశిలో ఉంటే "హాస్యావస్థ" అంటారు. ఇది చాలా శుభప్రదమైనది తలచిన పనులన్నీ నెరవేరతాయి. పుత్ర సంతానం కలుగుతుంది. కార్యసిద్ధి. చంద్రుడు పరమోచ్చ భాగలలో ఉన్నట్లయితే "రత్యావస్థ" అంటారు. ఈ సమయంలో ఎవరు ఏ ప్రశ్న అడిగినా కార్యసిద్ధి శీఘ్రమే జరుగుతుందని చెప్పవచ్చు.

## ప్రత్యేక గోచార ఫలితములు

ఈ క్రింద పేర్కొనబడే గోచార ఫలితములు అన్ని లగ్నములవారికీ వర్తిస్తాయి.

1) చంద్రుని లగ్నము నుండి గురుని లగ్నము నుండి పంచమాధిపతుల భాగలను కలిపినపుడు, గోచారరీత్యా అని ఆ స్థానమునకు వచ్చినపుడు జాతకునికి పుత్రోదయం కలుగుతుంది అయితే పంచమాధిపతికి శుభదృష్టి ఉండాలి

ఉదాహరణ- శ్రీ M. సంపత్ కుమార్

జననం 1957-5.21 సమయం రాత్రి 7-49 Long 82-13 Lat 16.57 కుంభరాశి, వృశ్చిక లగ్నం, K.P. అయనాంశ - $23^{0}$ -10'

గ్రహస్థితి

| | |
|---|---|
| రవి-$34^{0}$-54' | చంద్ర 305-39 |
| కుజ-77-17 | బుధ - 16-53 |
| గురు-148-29 | శుక్ర-46-41 |
| శని-228-29 | రాహు-205-54 |
| కేతు-25-54 | లగ్నం-235-36 |

చంద్ర లగ్నమైన కుభము నుండి పంచమాధిపతి బుధుడు, గురులగ్నమైన సింహము నుండి పంచమాధిపతి గురుడే. వీరిరువురి భాగలు కలుపగా

బుధుడు - 16 53
గురుడు - 148.29
15-22

కన్యలో 15-23 భాగలు వచ్చినవి.

ఈ కన్యారాశిపై గోచార గురుని పంచమదృష్టి పడిన కాలమున అనగా గురుడు వృషభ రాశిలో సంచరించు కాలమున 1977లో ఈ జాతకునకు పుత్ర సంతానము కలిగినది.

అనగా గురుడు ఆ రాశిలోకి వచ్చిననూ, ఆ రాశిని 5-7-9 దృష్టితో చూచిననూ సంతానము కలుగు అవకాశమున్నది. దశమమందున్న గురునికి, భాగ్యాధిపతి అయిన చంద్రునికి శుభాదృష్టి కలిగినది. ఈ గురుడు పంచమాధిపతి కావున, లక్షణములన్నియూ సరిపోయినవి.

2) లగ్నాధిపతి, చతుర్ధాధిపతి, లాభాధిపతుల యొక్క భాగలు కలుపగా వచ్చిన డిగ్రీలలో గోచారరీత్యా శని సంచరించునపుడు జాతకుడు, ధనవృద్ధి, సౌఖ్యము, ఉద్యోగము, పదవి పొందును

3) ద్వితీయ, లాభ, లగ్నాధిపతుల డిగ్రీలు మొత్తం కూడగా వచ్చిన రాశి. భాగలకు, గోచార గురుడు వచ్చినపుడు జాతకుడు ధనలాభము. సంతోషము పొందును. అయితే ఆ స్థానమునకు శుభదృష్టి కూడా ఉండాలి

4) ద్వితీయ, పంచమాధిపతుల డిగ్రీలకు కుజుని డిగ్రీలు కలుపగా, వచ్చిన రాశిభాగలలో గోచార శని సంచరించినపుడు నష్టం. పశునష్టం, ఆస్తులు అమ్ముట ఉద్యోగ భంగం జరుగుట మొదలగు దుష్ట పరిణామాలు కలుగుతాయి.

5) లగ్న, పంచమ, సప్తమాధిపతుల భాగలు కలుపగా, ఆస్థానమునకు గోచార శని సంచరించునపుడు, జాతకుడు వృత్తి ఉద్యోగములు పొంది, వాటిలో అభివృద్ధి చెందును. లక్ష్యసిద్ధి జరుగును. దశమాధిపతి దృష్టి శనిపై ఉండాలి.

6) ద్వితీయ, దశమ, లాభాధిపతుల భాగలు కలుపగా, ఆ స్థానములో శని సంచరించునపుడు, గురుని దృష్టి పొందినచో జాతకుని వివాహము జరుగును అనేక సుఖ సంతోషములు సంభవించును.

7) ద్వితీయ, దశమ, లాభాధిపతుల భాగలు కలుపగా, ఆ స్థానములో శని గోచారీత్యా సంచరించినపుడు. జాతకునికి వివాహము, పుత్ర సంతానము, వాహనములు, భూములు, మొదలగునవి పొందును.

9) ద్వితీయ, భాగ్య, వ్యయాధిపతుల భాగలు కలుపగా వచ్చిన స్థానములో, శని గోచారరీత్యా సంచరించినపుడు, ధననష్టం, మనో విదారం కలుగుతాయి.

10) లగ్న-పంచమ-వ్యయాధిపతుల భాగలు కలుపగా వచ్చిన స్థానములో గోచార శని సంచరించినపుడు, జాతకుడు సంతానరీత్యా విచారము పొందును.

11) లగ్న-తృతీయ-వ్యయాధిపతుల భాగలు కలుపగా వచ్చిన స్థానములో, గోచార శని సంచరించునపుడు సోదరులకు హాని కలిగించును.

12) తృతీయ-షష్ఠ- వ్యయాధిపతుల భాగలు కలుపగా వచ్చిన స్థానములో, గోచార శని సంచరించునపుడు కూడా సోదరులకు కీడు కలుగును.

13) ద్వితీయ సప్తమ-వ్యయాధిపతుల భాగలు కలుపగా వచ్చిన స్థానములో గోచార శని సంచరంచునపుడు ధననష్టం, మనోవ్యధ కలుగుతాయి.

14) చంద్ర లగ్నము నుండి ద్వితీయాధిపతి, శుక్రుల యొక్క భాగలు కలుపగా వచ్చిన స్థానములో, శుక్రుడు సంచరించినపుడు నిర్దిష్ట దశాంతర్దశలలో జాతకుడు స్త్రీ లాభమును పొందును.

15) లగ్న-దశమ లాభాధిపతుల భాగలు కలుపగా వచ్చిన స్థానములో, గురు-బుధుల సంచారమువల్ల జాతకుడు తీర్ధయాత్ర చేయును.

16) తృతీయ లాభ వ్యయాధిపతుల భాగలు కలుపగా వచ్చిన స్థానములో గోచార రాహువు సంచరించినపుడు. సోదర నష్టం, మరియు రోగబాధలు కలుగుతాయి.

17) లగ్న-ద్వితీయ-లాభాధిపతుల భాగలుకలుపగా వచ్చిన స్థానములో శని సంచరించునపుడు ధనలాభం కలుగుతుంది. వీరికి, చంద్ర లేదా గురుని భాగలు కూడా కలుగవచ్చు.

18) తృతీయ-అష్టమాధిపతుల భాగలు కలుపగా వచ్చిన స్థానములో గోచార కేతువు సంచరించునపుడు, వృత్తి, వ్యాపారములలో ఆటంకములు, స్థానచలనం కలుగుతాయి. ఇదే స్థానములో శని గోచారరీత్యా సంచరించునపుడు జాతకుడు మృత్యువును పొందును.

## 2. వృషభ లగ్నం

### 1. గదా నాడీ అంశ

వృషభలగ్నమందు గదా నాడీ అంశములో విప్ర కాలములో జన్మించినపుడు, గురుడు మిధునములోనూ, బుధుడు, రవితో కలసినపుడు జాతకుడు నల్లనివాడైననూ కళ గలిగియుండును. చంద్ర లగ్నాధిపతి అయిన శని ఉచ్ఛ స్థితిలో నుండి గురుదృష్టి పొందినచో, ఇట్టి జాతకులు ఏ స్థిరలగ్నమలో జన్మించిననూ, తండ్రికి ఒకే కుమారుడుగా, సోదరులు లేనివారై జన్మించుదురు. లగ్నాధిపతి మీనములో నుండి శని వీక్షితుడైనచో, ద్వితీయ దశలో జాతకుడు ఉపనయన సంస్కారము పొందును.

ఇట్టి నాడీ అంశలో జన్మించిన జాతకునికి 10వసం॥లో వివాహమగును. శుక్రుడు శనిచే చూడబడి, సప్తమాధీపతి పంచమస్థానమందున్నచో, వధువు జాతకుని స్వగ్రామమందే లభించును.

శుక్రుడు మేషంలో ఉండి శని వీక్షితుడైనచో గొప్ప ధనయోగము కలుగును. అయితే శుక్రుడు కన్యానవాంశయందున్నచో ఈ యోగబలము తగ్గిపోవును.

ద్వితీయ దశయందు క్రూర గ్రహాంతర్దశలలో బంధు అరిష్టము కలుగును.

★ స్థిరలగ్నజాతకులకు అందరికీ (వృషభ-సింహ-వృశ్చిక-కుంభ) (5-48- 6-00) చతుర్ధాధిపతి హరిణాంశలోనూ, తృతీయాధీపతి సూర్యనాడీ అంశలోనూ (2812-28.24) ఉన్నచో, జాతకుడు 4వ దశలో గొప్పగా సుఖసంతోషములు, ధనవృద్ధి పొందును.

★ గురు అష్టకవర్గులో, గురుడు 5 బిందువులు పొంది, లాభస్థానమందున్నచో జాతకునికి 2 కుమారులు కలుగుదురు.

శ్లో॥ చంద్ర లగ్నాధిపే సూర్యే
గురుణా చ నిరీక్షితే
అష్టషష్టి సమే మృత్యుః
గదాంశే నాత్ర సంశయః॥ -2082

గదాంశ నాడీఅంశ జాతకునికి చంద్రుడు సింహంలో ఉండి, రవిని గురుడు చూచినట్లయితే 68సం॥లు జీవించును

## వృషభ లగ్న సామాన్య ఫలితములు

★ వృషభలగ్న జాతకులు కష్టములు సహిస్తారు శతృవులను జయిస్తారు వివాహం త్వరగా అరుతుంది. అయితే భార్యకు, నడుమునందు అనారోగ్యం. భవిష్యత్ జ్ఞానంవీరికి ఉంటుంది. లగ్నాధిపతి అయిన శుక్రుడు నవమంలో (మకరం) ఉంటే గొప్ప అదృష్టం ద్వితీయ రాహువు ధనయోగం లోభి గుణం చంచల స్వభావం కలిగియుంటారు.

## 2. విత్తనాడీ అంశ

ఈ నాడీ అంశలో జన్మించినవారికి, 2లో ఉన్న రాహువు ప్రథమార్థం జననం అయితే విద్యావంతుడు, ఉన్నత వంశస్థులతో జీవితం ఏర్పడతాయి.ద్వితీయార్థం అయితే విద్యలో విఘ్నాలు

చంద్రుడు మీనంలో ఉండి తులా నవాంశదు పొందినట్లయితే జాతకునికి ముగ్గురు సోదరులు, ముగ్గురు సోదరిలు కుజుని అష్టకవర్గు బిందువుల ననుసరించి సోదరిల సౌఖ్యము ఆయువు నిర్ణయించాలి.

వృషభలగ్నం-యమషష్ట్యంశలో (12 30 దుంచి 13-00 వరకు) జననమయితే చాలారిష్టదోషం కలుగుతుంది. మొదటి దశలో పాపాంతర్దశలో, రవి పాపస్థాన సంచారసమయంలో అరిష్ఠం కలుగుతుంది. దోష పరిహారార్థం వెండితో చంద్రబింబం చేయించి, పూజించి బ్రాహ్మణులకు దానం చేయాలి. తల్లికి కూడా ఆరోగ్యం బాగుంటుంది

మీన చంద్రుడు. తులా నవాంశపొంది కుజ వీక్షితుడైనచో జాతకునికి ముందు మాతృవియోగం కలుగుతుంది. శని దశలో పాపాంతర్దశలలో దోషపరిహారాలు శాస్త్రోక్తంగా ఆచరించాలి.

గురుడు అష్టమంలో స్వక్షేత్రంలో ఉండి వృషభ నవాంశను పొందినట్లయితే, జాతకుడు 50 సం॥ నందు మరణించును.

శ్లో॥ యది జీవతి పుణ్యేన
విక్రమేశస్య దాయగే ॥
రాహు జీవాంతరే కాలే
కాల మృత్యుర్భ విష్యతి॥ -3177

పుణ్యావశముచేత 50 దాటితే, మూడవ స్థానాధీపతి అయిన చంద్రదశలో, రాహు లేదా సర్వంతర్దశయందు మారకము పొందును.

చంద్రుడు శాంతినవాంశను పొంది, కుజుడు కర్కాటక నవాంశనుగాని, మిధున నవాంశనుగాని పొందినచో జాతకుడు తాంత్రికవేత్త అగును. క్షుద్ర విద్యోపాసకుడగును. భార్య ప్రవర్తన విరుద్ధముగా నుండును, దురాచారపరుడయి వ్యభిచారి యగును.

2. అబలాంశ (26-48నుంచి27.00)

స్థిరలగ్నం అబలాంశలో మొదటి భాగమందు జన్మించినవారు బ్రాహ్మణులగుదురు. నల్లని శరీరము, సన్నగా ఉండి సుఖజీవనము గడుపుదురు. అన్నకు ఇష్టులుగా ఉండి, బాల్యమందు కొన్ని కష్టముల ననుభవించుదురు. సోదరి భర్త వల్ల ఇతర ప్రాంతములందు ఉద్యోగము పొందుదురు. ఈ నాడీ అంశనే కొందరు "ప్రభా నాడీఅంశ" గా పేర్కొన్నారు.

వృషభ-కుంభ లగ్నములకు లగ్నములో కుజుడు. పంచమములో గురుడు ఉన్నచో జాతకునకు సోదరులుండరు.

అబలాంశ జాతకునకు మొదటి భాగజననమైనచో ఇరువురు సోదరిలు, ఒక సోదరుడు ఉండును. పితృసుఖం తక్కువ. మాతృవర్గ సంబంధము కూడా తక్కువే.

ద్వితీయ దశయందు పవప్రాంత నివాసము చేయును.

వృషభలగ్నం-మేషనవాంశ(10.00నుంచి13.20) జనననమైనచో, జాతకుడు తీర్థయాత్రా స్థలయునందు అభివృద్ధి పొందును చంద్రుడు అబలాంశను పొందినచో జాతకునకు ఇద్దరు భార్యలుందురు.

అబలా నాడీఅంశ జాతకులకు గతజన్మలో బ్రాహ్మణ శాపం ఈ జన్మలో అనుభవిస్తారు. వీరికి సంతానముండదు. సేతుస్నానము చేసి. శివార్చన చేసినట్లయితే సంతానం కలుగుతారు. సోమవారం నాడు దానాలు చేయాలి.

కాలకూటాంశ

గురుడు ఈ అంశయందు ఉన్నచో జాతకుడు స్వతంత్రముగా ధనసంపాదన చేయును. బాల్యమందు పిత్రార్జితమును అనుభవించును. వ్యవసాయ సంబంధ వృత్తులలో జీవనము పొందును.

## మాలినీఅంశ

గురుడు ఈ అంశయందు ఉన్నచో, జాతకుడు వృద్ధాప్యమునందు మతిచాంచల్యము పొంది అరణ్యములో జంతువులచే మరణము పొందును.

ఈ అంశలో ప్రథమార్ధంలో జన్మించినవారు, వారి సోదరులకు 48 లేదా 51 సంవత్సరమునందు ప్రమాదము కలుగవచ్చు.

కర్కాటక లగ్నజాతకులకు కుజదశ. గుర్వంతరం అనేక కష్టాలు, అనారోగ్యం కలుగజేస్తుంది. అకాల మృతి కూడా సంభవించవచ్చు. ఇవేమీ జరగనిచో కుజదశ చివరిలో ధన నష్టం కలుగుతుంది.

(గురుదశలో కుజాంతరం కూడా కొంత బాధించడం అనుభవ సిద్ధముగా నున్నది. ముఖ్యముగా ఆరోగ్యం కొంత పాడవుతుంది. నడుము,ఉదరకోశ వ్యాధులు సంభవించవచ్చు.)

మేషలగ్నం-కర్కాటక నవాంశ జాతకులకు "కుజదశ" బాగా యోగిస్తుంది. రాహు దశలో వివాహము, పుత్ర సంతానము కలుగుతాయి.

## విశ్వంభర నాడీ అంశ

గురుడు, కుంభలగ్న జాతకులకు ఈ నాడీ అంశలో ఉన్నట్లయితే, మంచి రూపం ఉండి, విద్యావిఘ్నములు పొందుతారు. మిత్ర గ్రహనవాంశనుగాని పొందినచో జాతకుడు ఉన్నతపదవిని, ధనలాభమును పొందుతాడు.

రాహువు లగ్నంలో ఉండి, రవిచేత చూడబడినచో, జాతకుడు నల్లని దేహముగలవాడై, కాలాంతరమందు బంధు విరోధి యగును. (లగ్నంలో శనివున్ననూ ఈ ఫలితము సంభవించుచున్నది) తల్లి వలన విచారము పొందును. బాల్య మందు తండ్రికి అరిష్టం. సోదరమూలకముగా ధనలాభము.

కుంభ లగ్నజాతకులకు రవి-కుజులు కలసి. రవి హోరలో ఉంటే పత్ర్యమాంకం (దుర్మరణం) సంభవిస్తుంది).

తులా సంక్రమణ ప్రారంభం రోజున సముద్ర స్నానం చేస్తే సూర్యగ్రహ దోషం పోతుంది. ఉద్యోగం, తండ్రి, ఆరోగ్యం, ఇవన్నీ బాగుంటాయి.

శ్లో॥ సుఖే భాగ్యాధిపే శుక్రే
షష్ఠే శని సమన్వితే
జాతకస్య సువిద్యాప్తిః
బహు గ్రామాధికార వాన్ ॥

లేఖ్య విద్యా సమర్థిశ్చ
లిపిత్రయ సురాచకః -159

భాగ్యాధిపతి చతుర్థంలో ఉండి శని, శుక్రులు 6లో ఉంటే, జాతకుడు గొప్పపండితుడు, లేఖకుడు, మూడుభాషలు వ్రాయడం, చదవడం వచ్చినవాడగును. అధికార పదవిని పొందును

గురుడు, వరుణ నాడీఅంశలో ఉంటే జాతకునికి 18వ సం॥ నుండి, తండ్రికి భాగ్యవృద్ధి, గొప్పవారితో పరిచయాలు కలుగుతాయి. అష్టయాధిపతికి పాపత్వము బాగా పట్టినట్లయితే జాతకుని తండ్రికి అరిష్టం ఈ ఫలితములు షష్ఠాధీపతి దశలో దశమాధిపతి అంతర్దశలో జరుగవచ్చు. గురు-శుక్రులు లగ్న కేంద్ర స్థానాలలో పరస్పరం ఉన్నట్లయితే జాతకుడు రెండు-మూడు భాషలలో గొప్పపండితుడగును.

### భా ర్య జ న్మ రా శి

శ్లో॥ దారే శాంశేతత్రికోణే
దార జన్మర్ద భం విదుః॥
దారే శదృష్ట రాశౌ వౌ
యోజయేత్ కాలవిత్తయః॥

సప్తమాధిపతి యొక్క నవాంశ రాశిగాని చూచిన రాశి కూడా పరిగణించవచ్చు. దానికి 5-9 రాశులు గాని భార్య జన్మరాశి అవుతుంది. సప్తమాధిపతి యొక్క నవాంశ రాశినుండి సూర్యాది శని పర్యంతమూ సప్తగ్రహములు 7 రాశులలో ఉన్న జాతకుడు దరిద్రుడు, బాల్యమందు అనేక కష్టములు పొందువాడు అగును. లగ్నం దుంచి 7 గ్రహములు 7 రాశులలో నున్న లగ్నమాలికా యోగం. రెండవ స్థానం నుంచి 7 రాశులలో నున్న ధనమాలికా యోగం. మూడవస్థానం నుంచి 7 రాశులలో ఉన్న విక్రయమాలికా యోగం, ఇవన్నీ మంచివే.

### భార్యకు ప్రమాదం

సప్తమాధీపతి కుంద నాడీఅంశలో ఉంటే, ద్వితీయాధీపతి దశలో భార్యకు, తండ్రికి ప్రమాదం సంభవిస్తుంది. లాభ రాహువు జాతకంలో ఉంటే రాహుదశలో, ద్వితీయ వివాహం జరుగుతుంది.

"లాభే రాహు దశాకాలేద్వితీయో ద్వాహ యోగవాన్" -1-700

### చిత్రయోగం

కన్యాలగ్న జాతకులకు. ద్వితీయంలో బుధుడు 1.24 నుండి 1.36 భాగలలో ఉంటే "చిత్రయోగం" కలుగుతుంది దీనివల్ల గొప్పధనవంతులవుతారు.

దీనిని అన్ని లగ్నాలకూ వర్తింపజేయవచ్చు. లగ్నాధిపతి ద్వితీయంలో సూర్య నాడీఅంశలో వుంటే, ఈ ధనయోగం కలుగుతుంది.

"బుధనాడీ" గ్రంధములో కాలచక్ర దశాఫలితములు చెప్పబడ్డాయి.

మీన లగ్నజాతకులకు, మేష రవి. ధనస్సులో రాహువు ఉన్నట్లయితే 6వ రాశిదశ కష్టాలు కలుగజేస్తుంది

శని కమలాంశను పొందితే, సింహరాశి దశలో వైష్ణవ విరోధం కలుగుతుంది.

చరలగ్న జాతకులకు (మేష- కర్కాటక- తుల- మకరములు) రవి మీనంలోనూ, శని 11లోనూ ఉండి 3-6-11 రాశులలో పాపులుంటే, మాతృవర్గ నాశనమునకు జాతకుడు కారకుడగును

**శకట యోగం**

విత్తే రాహుయుతే చంద్రే
శకటేతు ప్రజాయతే ॥
బహు విద్యాది సంపన్నః
ఊహాపోహ పటుస్సుధీః॥

ధనస్థానమందు చంద్ర- రాహువులున్నచో, శకట యోగమందు (2లోగురుడు) జన్మించిన జాతకుడు అనేక విద్యలు తెలిసినవాడు, ధనవంతుడు మేధావి అగును.

తులాలగ్న జాతకులకు, శుక్రుడు సింహరాశిలో ఉంటే ఇంద్రయోగం-ఇట్టి శుక్రుడు శని-బుధులతో కలసి కటక నవాంశను పొందాలి. ఈ యోగంలో జన్మించినవారు, గొప్పధనవంతులు ధర్మకార్యములు ఆచరించువారు అగుదురు ఇది 'యోగనాడీ' గ్రంధమందు పేర్కొనబడింది. ఈ ఫలితములు 3-4 దశలలో జరుగుతాయి.

చరలగ్న జాతకులకు, శుక్రుడు వృషభంలో వుండి కుంభ నవాంశను పొందితే 27 సం॥ నుండి రాజయోగం కలుగుతుంది.

**మూర్ఖయోగం**

"లగ్నే శే మకరాంశస్థే మూర్ఖప్రకృతికో పవాన్"

లగ్నాధిపతి మకర నవాంశను పొందితే జాతకుడు మూర్ఖుడు, కోపంగలవాడు అగును

**వి ష్ణు యో గ ం**

రవి మేషంలో వుండి సింహనవాంశను పొంది, గురు-కేతువులు కలసివున్నచో విష్ణుయోగం ఏర్పడును లగ్నమునందు కుజుడు, వ్యయమందు శనివున్ననూ, విష్ణుయోగం

